జ్వాల తత్తద్బిరుదాళి దాల్చుటయు నావాదంబునం దాతడే
తల క్రిందైన గవిత్వ సన్యసన తత్వంబొందె గైకొంటయున్.

సరయున్స్ఫూర్తి గవీంద్ర సింహములు గర్జల్ చేసి వాదోప వా
దరసావేశమునందు దూకిన సమంద ప్రౌఢి భాట్ట ప్రభా
కర ముఖ్యాగమ సంప్రదాయములు దుర్గ్రాహ్యస్థితిం జెందె ని
ర్వ్యరు రూపొందు సరస్వతి ప్రతిభలం బాల్పొంది రప్పట్టునన్.

తల సూపెన్ సునిగూఢగూఢ హృదయ స్థైర్యంబుల న్విప్పి ని
స్తుల శాస్త్రంబులు, సాగిపోయినవి రోజుల్ కొన్ని యుక్తి ప్రయు
క్తులు నిండారె, మనీషలూరె; గడు రంతుల్ మీరె, నేహోజిగీ
షలు పెంపారె, ససూయలుట్టిపడె, నానల్ సుంతమోసుల్ గొనెన్.

ఎవని కెవ్వడు దీసిపోయినది లేదు, గెలుపుగొను ప్రోతమెవ్వనో తెలియ గాకు
మిగులు బుధులెల్ల గుటకలు మ్రింగు కొనుచు జూచి యున్నార లేదో యూ
హించు కొనుచు——

పైన జయంబుడంబు పసి పట్టిన దిట్టరి కొండవీటి యా
స్థాన కవీంద్ర శేఖరుని ధాటికి మాటికి నాన గొంది యా
స్థాన కవీశ్వరుండు కల తన్గొని యంత రవంత సాహితీ
జ్ఞానము తప్పు దారుల ప్రసంగములన్ జెనుగాడ జూడగా.

సంలిత మందహాసముల చాయలు చక్కని ముత్తియంపు బం
టలుగద, నోరచూపుల దటాలున వానిని బాణిసీయ స
స్తుల తమ భావ్య ఫక్కికల ద్రోసె సతంబు నిరుత్తర స్థితిన్
వెం వెల బాటు మోమున జనింప గరంబనుకంపనీయుడై.

కిమ్మనలేక చేతులు మొగిడ్చి మహాశయ! శబ్దశాస్త్రవా
దమ్మున నోడినాడ, బిరుదమ్ములివే- గెలు పొందినావు లే
లెమ్మిక గంచు ఢక్క వగిలించెద నీవిజయమ్ము లాంధ్రదే
శమ్ముల సొమ్ములై గొనలు సాగుత చెల్లు గవీంద్రులుబ్బగన్.

"జయ" శ్రీనాథ కవీంద్ర సింహ విజయ స్వాతంత్ర్య లక్ష్మీ కళా
మయ! సాహిత్య నవాంధ్ర మార్గకవితా మాధుర్య సామ్రాజ్య ని
ర్ణయ సింహాసన సార్వభౌమ! జయ! యన్నాదంబులంబూర్ణ వి
స్మయులై పోయిరి రాయలున్ బుధులు "శుంభద్భిన్నఢక్కార్భటిన్"

ఉదయ శ్రీమృదులారుణ ప్రభలలో నుయ్యాలలూగెన్ నవా
భ్యుదయుండై కవిభాస్కరుండు విజయంపుం దమ్మి నెమ్మోము వి
చ్చె దయామూర్తి సువర్ణ పుష్ప మధుర శ్రీనించె భూభర్త కీ
ర్తి దలిర్పన్ గవిసార్వభౌము "విజయ శ్రీ" హర్షముత్కర్షమై.